23.6.37

# నాటికా గుచ్ఛము

మొదటి పుష్పము

విముక్తి

మాతృప్రేమ

నిష్ఫలం

B

# మేలురకము వజ్రములకు




## సురాజ్‌మల్స్

313, ఎస్‌ప్లనేడ్, మదరాసు

# నాటికా గుచ్ఛము

మొదటి పుష్పము

# విముక్తి—మాతృప్రేమ—నిష్ఫలం

గ్రంథకర్త:

పి. వి. రాజమన్నారు.



నమ్మాళ్వార్స

౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి.

పోస్టుబాక్సు నెం ౨౯౧, మద్రాసు.

సర్వస్వామ్య సంకలితము. ౧౯౩౭ వెల ఆరు అణాలు లేక ఒక షిల్లింగు

సుబ్బమ్మ

ఊఁ! అసహ్యంలేదు. అపహ్యంలేదు. దానికి కారణాలువేరు. అసలు వారి జరుగురే లేకుండావుంది. మునుపటి రోజుల్లో వయసువచ్చిన కుర్రవాడికి ఏ ఆరో ఏడో ఏండ్లదాన్నిచ్చి వివాహం చేసేవారు. అది కాపరానికి రావడానికి ఏ ఎనిమిదేండ్లో అయ్యేది. అంతవరకూ......చూచారూ....

కామేశ్వరమ్మ.

(నవ్వుచు) అర్థమయింది. ఇప్పుడు ఈడుగల పిల్లలకే పెండ్లిచేయడంచేత కుఱ్ఱవాళ్లు దుర్మార్గానికి దిగరంటావు. అది బాగానేవుంది.

సుబ్బమ్మ

బాగాచెప్పారు. మన ఆచారాలు, సాంప్రదాయాలు మట్టిలో కలిసిపోయా వన్న మాట మరచిపోయారు. అంతేకాదు. ఎన్ని పట్టాలున్నా ఏదో రహస్యంగా మనలోనూ ఆచారానికి భంగంకాకుండానే వివాహాలు జరుగుతూవున్నవి. కానీ ఇంకొక పెద్దకారణం. విధవవివాహాలు బలిసి పోతూవున్నవి. మంచి ప్రాయంవచ్చిన వెధవముండలు హాజరుగావుంటే కుఱ్ఱవాళ్లకి పూర్వపు బాల్యసంబంధాలు ఎలారుచిస్తవి?

కామేశ్వరమ్మ

సుబ్బీ! మన ధర్మశాస్త్రాలకు విరుద్ధమనిగాని, వారి గోడుకూడా చాలా కష్టమైంది కాదూ. చూడు మన సుభద్రగతి.

సుబ్బమ్మ

దానికి మన మేమి చెయ్యగలం? వైవాహ్యం. అందుకని అది మొగుడో పెండ్లో అని గోడలు దాటుతూవుందా?

కామేశ్వరమ్మ

ఆ! నీకు చెప్పాలనుకున్నా దానివిషయం. దుర్మార్గం వుందనికాదు. ఎందుకూ

ముందు జాగ్రత్తగావుంటే తరువాత చిక్కురాదని. మన సుభద్రకు ఆల మూరివారి అబ్బాయితో పరిచయం ఎక్కువౌతున్నట్టుంది.

సుబ్బమ్మ

[కోపంతో] అహా!! ఎవడు నాబిడ్డని వేలుపెట్టి చూపించగలడో చూస్తాను! పాపం వుంటే లోకానికి భయపడాలి గాని.

కామేశ్వరమ్మ

సుబ్బీ! కోప్పడకు. ఏదో పెద్దదాన్ని, కదా. మన సుభద్రకు కష్టంవస్తే మనకు వచ్చినట్లేనా. విన్నావు కదూ, గోపాలకృష్ణయ్యగారి మేనకోడలి సంగతి.

సుబ్బమ్మ

ఆ పలుగాకిముండ రాధేనా? వినకేం! మన రాఘవరావుగారి కుమారుణ్ణి గంగలోకి దింపి కడుపు తెచ్చుకుండేగాక పైగా పెండ్లాడ మన్నదట. ఆ అమాయకుడు ఊఁ అని ఇంటికి వచ్చి అయ్య పెట్టేవి రెండు పెట్టిన తరు వాత మళ్లీ గిక్కుమనకుండా నోరు మూసుకొని వున్నాడు. పాపం. శుద్ధ శ్రోత్రియులు గోపాల కృష్ణయ్యగారు. దాన్ని ఎలా పెట్టుకొని భరిస్తారు?

కామేశ్వరమ్మ

పాపం! ఆ పిల్ల గతి ఇంకేమిటి?

సుబ్బమ్మ

చేసుకున్న దానికి అనుభవిస్తుంది. అంతటితో పోదుగా......మంచి కుటుంబం పేరు భ్రష్టుచేసింది.

(అప్పుడు ప్రవేశము వెంకటేశ్వర్లు. కామేశ్వరమ్మ తమ్ముడు. పని పాటు లేదు. భూములపైవచ్చే ఆదాయంతో వేశ్యలనీ తన్నూ పోషించు కుంటూ బావగారింట్లో ఉన్నాడు.)

కామేశ్వరమ్మ

ఇదుగో మాతమ్ముడు. ఏమిరా! గోపాలకృష్ణయ్యగారి మేనగోడలి సంగతి ఏదైనా సంపాదించావా ?

వెంకటేశ్వర్లు

(చుట్ట వెలిగిస్తూ) ఆ అమ్మాయి పారిపోయిందన్నారు.

సుబ్బమ్మ

ఆ! ఆ! ఎవరితో ?

వెంకటేశ్వర్లు

సుబ్బమ్మగారి భావాలు ఎలా పరుగెత్తుతున్నవో! లేదు. ఎవరితోను గాదు. లేచంటేట తానే. ఎవరితో చెప్పకుండా వెళ్లిపోయిందట.

కామేశ్వరమ్మ

ఏమైపోయిందో కదా.

[ప్రవేశము సుభద్ర, సుబ్బమ్మకూతురు. బాలవింతువు. నడవడిక మంచిది గాదు.]

సుభద్ర

ఎవరు ?

కామేశ్వరమ్మ

రాధ.

సుభద్ర

రాధా! ఆవిడసంగతి చెప్పడానికే వచ్చాను.

వెంకటేశ్వర్లు

తమ రిప్పు డెక్కడినుంచి రావడం ?

సుభద్ర

(పెదవులు త్రిప్పుచు) జగన్మోహిని యింట్లోనుంచి.

వెంకటేశ్వర్లు

ఛీ ! ఊరుకో—నీవు ఆలమూరివారి అబ్బాయితో చాలాదూరం వెళ్లుతున్నట్లుంది సుమా:

సుభద్ర

గురివిందట తన మచ్చ మరిచిపోయి ఇతర్ల నాక్షేపించిందట!

కామేశ్వరమ్మ

సుభద్రా! చాలు.

సుభద్ర

మరి నన్ను అలా అనడం న్యాయమేనా?

కామేశ్వరమ్మ

రాధ ఏమయింది?

సుభద్ర

రాధ మనవూరికే వచ్చిందట.

సుబ్బమ్మ

ఎంత చొరవ! అన్నిటికి తెగించింది.

(కిటికిలో స్త్రీవ్యక్తి కనబడుతుంది, వెనక మాటలు వినబడుతవి. "కామమ్మగారూ! కామమ్మగారూ!" అని.)

కామేశ్వరమ్మ

ఎవరది?

సుబ్బమ్మ

(పుస్తకం పారవేసి గుడ్లు పగిలిపోవునట్లు చూస్తూ ఉన్నది.)

సుభద్ర

(తలుపు తీస్తుంది)

[ప్రవేశము రాధ. వయసు 18-కి మించదు. సౌందర్యవతి. బాల

వితంతువు. గర్భవతి. అలసి వాడిపోయి వున్నది. దుఃఖముతో క్రుంగి పోయినది.]

రాధను చూచినంతనే మొదట అందరి ముఖాలు రక్తహీనములై పోయినవి. తరువాత ఒక్కొక్కరి ముఖంలో ఒక్కొక్క భావము. కామేశ్వరమ్మకు జాలి. సుబ్బమ్మకు కోపము, అసహ్యము. వెంకటేశ్వర్లు సౌందర్యము చూచి ఆనందిస్తున్నాడు. సుభద్రకు హేళనముతో గూడినసందా.

రాధ

కామేశ్వరమ్మగారూ! ఇంత హఠాత్తుగా వచ్చినందుకు క్షమించవలెను.

కామేశ్వరమ్మ

[ఏమో అనబోయి సుబ్బమ్మవంక తిరిగి ఆవిడచూపులోని బెదరింపుకు భయపడి ఆగిపోవును.]

రాధ

(కొంతనిట్టూర్పుతో) నే నెవరినో ఎరుగుదురా? ఈస్థితిలో ఆనవాలు పట్టలేక పోవచ్చునేమో అని అడిగాను.

సుబ్బమ్మ

ఎరగ కేమి? గోపాలకృష్ణయ్యగారి మేనగోడలివి కావు?

కామేశ్వరమ్మ

(కొంతధైర్యంతో) ఎరగ కేమమ్మా. మీ తల్లిని బాగా ఎరుగుదును, పాపం!

రాధ

(కండ్లనిండానీళ్లతో) అమ్మ పుణ్యాత్మురాలే లెండి. నా యవస్థ చూడకుండా వెళ్లిపోయింది.

వెంకటేశ్వర్లు

(ఏమనడానికి తోచక ఏమైనా అనవలెనని) అయ్యయ్యో!

సుబ్బమ్మ

అయితే - అమ్మాయి! ఇలా అకస్మాత్తుగా రావడం మాకర్థము కాలేదు. గోపాలకృష్ణయ్యగారు నీవు వస్తున్నావని ఉత్తరం వ్రాసినట్లు లేదే.

రాధ

లేదు. నేను ఇచ్చటికి రావడం వారికి తెలియదు. (తల గిర్రుమని తిరుగుటచే కండ్లుమూసుకొనును.)

కామేశ్వరమ్మ

నిలబడేవున్నావెందుకు? కూర్చోవమ్మా.

సుబ్బమ్మ

(రహస్యంగా) వదినెగారూ; వ్యవహారం ఏమీ నాకు నచ్చలేదు.

కామేశ్వరమ్మ

(తబ్బిబ్బుతో) ఏంచెయ్యాలె మనం?

రాధ

నాకథ చెప్పుకోవడానికి నాకే సిగ్గువేస్తూవున్నా చెప్పుకోక తప్పదు. మీకూ తెలిసేవుండవచ్చును.

సుబ్బమ్మ

ఆహా! ఊరూరా గోపాలకృష్ణయ్యగారి పేరు నీమూలాన్న దుకాణాలకు, రోడ్డుమీదికి వచ్చింది. తెలియకేమి?

రాధ

మీ కొన్నిమాటలన్నప్పటికీ జవాబుచెప్పలేని స్థితిలో ఉన్నాను. కేవలం

నేనొక్క_తెనయిన, ఏ బావియో, ఏ గుంటనో చూచుకొనే వుందును. కాని...(గద్గదస్వరముతో) ఇంకొక ప్రాణం ...(మాటలాడలేకపోవును.)

కామేశ్వరమ్మ

రామ! రామ!

సుబ్బమ్మ

(పెద్దగొంతుతో) అయితే యిప్పుడు మాయింటికి రావడం నాకేమీ సబబుగా కనబడ్డం లేదు. వీధిలోవెళ్లే శనేశ్వరుడా మాయింట్లోకి రారాదా అన్నట్లుంది.

రాధ

అబ్బబ్బా! మీరింత పరుషంగా మాటాడ నవసరంలేదు. దీనస్థితిలోవున్న నాపై కరుణించి ఆదరిస్తారేమోనని వచ్చాను. కాని మిమ్మల్ని బాధపెట్టవలెనని రాలేదు.

కామేశ్వరమ్మ

సుబ్బీ! ఎందుకంత కఠినంగా అన్నావు?

సుబ్బమ్మ

ఏమీ! కఠినమా? అఘోరించినట్లేవుంది. అన్నయ్యారానీ తెలుస్తుంది.

(ప్రవేశము వెంకటసుబ్బయ్యగారి కుమారుడు సత్యనారాయణ. వయసు 24. అందగాడు గాకపోయినా సులక్షణుడే)

సత్యనారాయణ

(ముదట రాధనుచూచి తరువాత ఒక్కొక్కరినిచూస్తాడు. సూక్ష్మగ్రాహి కావున కొంతవరకు అర్థంచేసుకుంటాడు.) అమ్మా! ఏమిది రాధ ఇలానిలబడ్డది?

కామేశ్వరమ్మ

అబ్బే! ఏమీలేదు...నాయనా...ఇప్పుడే...అకస్మాత్తుగా వచ్చింది.

సుబ్బమ్మ

(విగ్గరగా) మీ అమ్మకు మతిపోయింది. ఈ అమ్మాయి సంగతి నీకు పూర్తిగా తెలియనట్లుంది. భర్తను ధారవోసుకొని, ఏదోఒకమూల "కృష్ణా, రామా" అనికూర్చోలేక గడ్డిమేసి, మంచికుటుంబానికి సిగ్గుతెప్పించి ఇప్పుడు మన యిల్లు చేరింది—పురుడు పోయించుకోడానికి.

రాధ

[అవమానముతో సహింపరాని దుఃఖము తలకెక్కి- అసలే బలహీనదశలో ఉండడంచేత మూర్ఛపోయి క్రిందికి జారిపోతూవుంది.]

సత్యనారాయణ

(రాధ అవస్థచూచి తటాలున పడిపోకుండా చేతులతో పట్టుకొని) త్వరగా! త్వరగా! నీళ్లు, సుభద్రా వెళ్లు.

సుభద్ర

(తారుమారై లోపలికి వెళ్లి లోటాతో నీళ్లు తెచ్చిస్తుంది.)

సత్యనారాయణ

(రాధముఖముపై నీళ్లు చల్లుచున్నాడు.)

రాధ

(కండ్లుతెరచి సత్యనారాయణను చూస్తూవున్నది. కృతజ్ఞత వెల్లువగా కురుస్తున్నవి చూపులు- అంతేనా?)

సత్యనారాయణ

కొంతనెమ్మదిగా ఉందా?

రాధ

(తల ఊపుతుంది.)

సత్యనారాయణ

(మెల్లగా రాధను కూర్చుండబెట్టి లేచి తీక్ష్ణముగా నొక్కొక్కరిని చూస్తూ)

...మీరు...మీరు...మీరందరూ మనుష్యులేనా ?...మీ నరాల్లో రక్తమే ప్రవహిస్తూవుందా? లేదు...మీరు రాక్షసులు. రాక్షసులైనా తాము చంపినవారి మాంసము భక్షింతురు. అంతేగాని, ఇట్లు హింసింపరు... హింసించిచూచి ఆనందింపరు...అబ్బబ్బా! ఎంతపాషాణ హృదయాలు మీవి? జాలి అన్నది ఏకోశంలో లేదుగాబోలు...మా అమ్మకు జాలి లేదననుగాని, ఇందరు రాక్షసులలో ఒక్కతె ఏమిచేయగలదు? ...(కోపముతో) ఛీ! సిగ్గు, సిగ్గు! అబల, అసహాయ, చెప్పరాని దురవస్థలో చిక్కి, కృశించి, మీగడపదాటి "పాహి" అని వచ్చినదాన్ని, కూర్చోమని కూడా చెప్పక, చిత్రవధచెయ్యడానికి పూనుకొన్నారు—అయ్యారో! ఈవిడ పవిత్రమైనస్థితిలో నుంది. ఎరుగుదురా? గర్భవతి. సృష్టికి సిద్ధమవుతూ వున్నది. అనగా భగవత్ స్వరూపంధరించియున్నది... అట్టిదాన్ని దయతో ఆదరించి, పోషించడానికి బదులు ఎంత ఘనకార్యం చేశారు!...సుభద్రా! తీసికొనివెళ్లు. మేడమీద నా గదిలో పడుకోబెట్టి పాలూ అవి ఇప్పించు...అమ్మా! నేను కఠినంగా మాట్లాడానని నొచ్చుకోకు. నీయందున్న మాతృభక్తే అనుకో, ఈ రాధయొక్క మాతృస్వరూపాన్ని గ్రహింపజేసింది. (లోపలికి వెళ్లును.)

కామేశ్వరమ్మ

(చీరచెంగుతో కండ్లు తుడుచుకుంటూ) రా! అమ్మా! రాధా, రా! ముఖం, కాళ్లూ కడుక్కొని ఇంత పాలో కాఫియో పుచ్చుకొని పడుకో (రాధతో నిష్క్రమిస్తుంది.)

వెంకటేశ్వర్లు

(సగం తనలో సగం ప్రకాశంగా) అబ్బో! అబ్బాయి పెద్ద లెక్చరు కొట్టేశాడే!

సుభద్ర

ఇప్పుడా నోరు దెరవడం మీరు. ఏమిధైర్యం!

సుబ్బమ్మ

సుభద్రా! ఊరుకో...మనకెందు కీ గొడవ...మీ మామయ్య వస్తే తెలుస్తుంది పర్యవసానం.

సుభద్ర

మనసత్యం బావయ్యాకి రాధ బాగా పరిచయమైనట్లుందే.

సుబ్బమ్మ

కామమ్మవదినె రాధతల్లీ ఒక్కవూరివారు. చిన్నప్పటి స్నేహమనుకొంటాను.

వెంకటేశ్వర్లు

ఇప్పుడు మాత్రం స్నేహం ఎందుకుండకూడదూ?

సుభద్ర

(పకపక నవ్వును)

([ప్రవేశము లోపలినుంచి సత్యనారాయణ. అందరు మౌనము వహిస్తారు. సత్యనారాయణ చురచురా చూస్తూ వెళ్లిపోతాడు. ముగ్గురు ఒకరి నొకరు మాచుకుంటారు.]

తెర

•••• ◇◇◇ ◇◇◇ ••••

## రంగము-2. మేడమీద సత్యనారాయణగది.

[ఒకప్రక్క మంచం. ఇంకొకప్రక్క బీరువా. సమీపములో బల్ల. గోడ మీద ఫోటోలున్నవి. మంచంమీద రాధ కూర్చున్నది.]

రాధ

(లేచి, ఫోటో-సత్యనారాయణది. చూస్తున్నది. చప్పుడు విని ఉలికిపడి మళ్లీ మంచంమీద కూర్చుని, ఉస్సురుమని, ముఖం చేతులతో కప్పివేసుకొని, మెల్లగా ఏడుస్తున్నది.)

(ప్రవేశము సుభద్ర)

సుభద్ర

(సమీపించి) రాధా!

రాధ

(చేతులు తీసివేసి కండ్లు తుడుచుకుంటూ) కూర్చోండి.

సుభద్ర

కూర్చుంటాను, మర్యాదలెందుకో లే.

రాధ

(పలకదు.)

సుభద్ర

(కొంతసేపు ఊరకుండి) రాధా! నీవు తెలివిమాలిన పని చేశావు సుమా.

రాధ

(కనుబొమ్మలు ముడివేసింది.) ఏది ?

సుభద్ర

నవ్వనా, ఏడవనా !...ఇంకేమున్నది. మనబోటివారికి సంభవించే విపత్తు ఇంతకన్నా ఇంకేమున్నది.

రాధ

మనలో నున్నదా ?

సుభద్ర

ఆహా!...అందుకే అన్నాను తెలివితక్కువపని చేశావని. ఎందుకంటావా? ...లోకం అభిప్రాయానికి తోవా తెన్నూ ఉండదు. మనం ఏదో మనసు పట్టలేక తప్పుచేస్తామనుకో. అంత మాత్రంతో పోతే సవ్యంగానే వుంటుంది. లోకానికి తెలిసినా ఒక కన్ను మూసుకుంటుంది. మనకేమీ బాధ కలగదు...కానీ, కర్మవశాత్తూ ఈ కష్టం సంభవించిందా లోకం ఉగ్రమై పోతుంది....నా విషయంతీసుకో ఉదాహరణానికి. నేను మహాపతివ్రతనని చెప్పుకోవడంలేదు. అందులో నీతో ఎందు కబద్ధమాడుతాను? అయినా లోకం నన్ను వేలుపెట్టి చూపించిందా?......నీకి [illegible]—ఎంతబాధో? మనం చేసిన తప్పులో భేదంలేక పోయినా శిక్షించడంలో ఎంతభేదమో చూచావా?

రాధ

మీ మాటల్లో అర్థం నేను పూర్తిగా గ్రహింపలేకున్నాను. నేను తప్పని తెలిసి ఏపనీ చెయ్యలేదే.

సుభద్ర

(నవ్వుచు) అంతదూరం వెళ్లలేదు నాభావాలు. లోకానికి వ్యతిరేకంగా వర్తించగలధైర్యం నాకులేదు.

రాధ

విపరీతంగా అర్థంచేసుకున్నారు నామాట. నేనన్నది వేరు. వారు వివాహం చేసుకుంటానని వాగ్దానంచేశారు గనుకనే సమ్మతించాను.

సుభద్ర

(బిగ్గరగా నవ్వుతుంది)

రాధ

(తెల్లబోయి చూస్తూవుంది) ఇందులో హాస్యానికి చోటులేదే.

సుభద్ర

లేదు, లేదు. నీ అమాయకత్వానికి విచారించవలసిందే.

రాధ

అనగా?

సుభద్ర

వివాహం చేసుకుంటామని మగవారు మాట్లాడే మాటలు నమ్మడం......

రాధ

అబ్బ! ప్రపంచములో అంత దుర్మార్గం, అంత మోసం ఉంటుందా?...అవును, ప్రత్యక్షంగా అనుభవిస్తూవుంటే ఇక అనుమానం ఎందుకు... నిజంగా తెలివి తక్కువే.

సుభద్ర

ఏమీ అనుకోకు. నీకు ఇంకా లోకజ్ఞానం లేకపోవటంచేత ఎక్కువగా బాధ పడుతున్నావు. నేను వచ్చిం దెవరికి చెప్పవుగదా. (వెళ్లిపోవును.)

రాధ

(పరధ్యానంగా చూస్తున్నది.) [వెంకటేశ్వర్లు తొంగిచూస్తాడు. తరువాత చప్పుడుచెయ్యకుండా ప్రవేశిస్తాడు.]

రాధ

(లేవబోవును.)

వెంకటేశ్వర్లు

(వద్దని సైగచేస్తూ) కూర్చో, అమ్మాయీ, కూర్చో, అసలే ఒంట్లో పటుత్వం లేనిదానవు. అందులో మరీన్నీ—

రాధ

కామమ్మగా రేమైన చెప్పమన్నారా?

వెంకటేశ్వర్లు

అబ్బెబ్బే...(ఇటు అటూ తిరిగిచూచి) అబ్బే! నేనిక్కడికి రావడం ఎవరికీ తెలియదు. తెలియనక్కరలేదు కూడాను. నా అంతట నేనే వచ్చాను. ఒకరు కష్టదశలోఉంటే చూడలేను...ఉడతకు ఉడతాభక్తి అన్నట్లు ఏదో ఒకమాత్రమైనా సహాయం చెయ్యక ఊరుకోలేను.

రాధ

నాకు తమ రేమి సహాయం చేయగలరు?

వెంకటేశ్వర్లు

సహాయమంటే...స్వయంగా కాదనుకో...దారైనా చూపించవచ్చును గదా.

రాధ

(నిరాశతో) నాకేమి దారిచూపిస్తారు?

వెంకటేశ్వర్లు

అంత ఖచ్చితంగా అడిగితే ఏలా మరి? నీ విప్పుడేమి చేయదలుచుకొన్నావు?

రాధ

(పెదవివిరుస్తూ) ఏమో.

వెంకటేశ్వర్లు

నేనొక గొప్పవిషయంచెపుతాను సావధానంగా విను. "లోకమో, కులమో, మతమో, ఆచారమో" అని దేవుళ్లాడితేనే కలుగుతవి అన్ని కష్టాలు. లోకాన్ని ఎప్పుడు లక్ష్యంచెయ్యమో అప్పుడే సుఖం. శాస్త్రాలు అనుసరిస్తే కడుపు నిండుతుందా? మర్యాదకాపాడుకోబోతే నెత్తిమూడిపోతుంది...అంతే.

రాధ

ఏమిచెయ్యమంటారు?

వెంకటేశ్వర్లు

ఈయింటివారు శుద్ధఛాందసులు. పిరికిపందలు. నిన్ను వారింట్లో మూడు రోజులు ఉంచుకోరు. వాడు కుఱ్ఱవాడు, లెక్చరుకొట్టి వెళ్లిపొయ్యాడు. మా బావవచ్చిన తరువాత తెలుస్తుంది నీకే...నాటకానికి సమాప్తి.

రాధ

వెళ్లిపొమ్మంటే వెళ్లిపోకతప్పదుగదా.

వెంకటేశ్వర్లు

ఎక్కడికి వెళ్లగలవు?

రాధ

(పలకదు)

వెంకటేశ్వర్లు

మీ మేనమామగారింటికా?

రాధ

(కాదని తల ఊపుతుంది)

వెంకటేశ్వర్లు

రాఘవరావుగారింటికా?

రాధ

(కాదని సూచించును.)

వెంకటేశ్వర్లు

మరివిను: దమ్మిడీకి పనికిరాని ధర్మసంకోచాలు పెట్టుకుంటే సాగదు. ఉన్న సందర్భం ఏలాటిదో ఆలోచించుచు, ఉపకరించేసాధనాలు ఏవున్నాయో లెక్కపెట్టు. నేను చెప్పేమార్గం విను. ఆఖరుకు నీవే తీర్మానించు. ఏం...... వింటావా?

రాధ

ఊఁ.

వెంకటేశ్వర్లు

నాకు బాగా తెలిసినవారు ఉన్నారు ఈ వూర్లోనే. మంచి హృదయంకలవారు. నిన్ను కూతుర్లాగ చూచుకుంటారు. అనుమానం పెట్టుకుంటే మాత్రం ఉపయోగంలేదు. దయ, పరోపకారం మనకు కావాలిగాని వృత్తితో, జాతితో ఏం అవసరం? కాదంటావా?

రాధ

ఎవరువారు?

వెంకటేశ్వర్లు

నాకు చాలకాలంనుంచి పరిచయం. జగన్మోహిని ఆవిడపేరు.

రాధ

భోగంవారా ?

వెంకటేశ్వర్లు

అవును. అయితే నేమి.

రాధ

సరేలెండి. బాగా ఆలోచించి చెపుతాను.

వెంకటేశ్వర్లు

ఇంకా చాలా సహాయము కూడా చెయ్యగలదు. (రహస్యంగా) నీవు దేని మూలాన్ని ఇలా బయట పడ్డావో ఆబాధ కూడా తీర్చేస్తుంది. దాని దగ్గరున్న ఔషధాలు ఇంగ్లీషు డాక్టర్లగదద్ద కూడా లేవు.

రాధ

(కోపంతో) అయ్యా! నమస్కారం. తమరు వెళ్లిపోవచ్చును. ఇంత నిర్భయంగా ఇంత ఘోరమైన కార్యం చెయ్యమని చెప్పగలవారు ఎంతకైనా తగుదురు. మీరు నా విషయంలో ఏమీ కలుగజేసుకోవద్దు......వృధాశ్రమ.

వెంకటేశ్వర్లు

ఊహూ! ఇంకా తెలియడం లేదు ముందువచ్చేవి......ఎంత రోషం వచ్చింది...చూద్దాంకదూ......నీవే వస్తావు చేతులు జోడిస్తూ.

రాధ

వందనాలు మీకు...వెళ్లిపోరూ ?

వెంకటేశ్వర్లు

బంగారువంటి శరీరం వదులు కుంటున్నావు. జగన్మోహిని నిన్ను పువ్వుల్లో పెట్టుకుంటుంది.

రాధ

(బిగ్గరగా) కామమ్మగారూ! కామమ్మగారూ!

వెంకటేశ్వర్లు

(తత్తరముతో) ఓసీ! (పరుగెత్తును)

రాధ

(గుమ్మమువద్దకి వచ్చిచూస్తుంది వెళ్లిపోయాడో లేదో అని. ఆ సమయానికే సత్యనారాయణ వస్తున్నాడని గ్రహిస్తుంది. మంచంమీద మళ్లీ కూర్చుంటుంది, పైటసర్దుకొని.)

[ప్రవేశం సత్యనారాయణ కోటుతీసి స్టాండుకు తగిలిస్తాడు.]

సత్యనారాయణ

వెంకటేశ్వర్లుమామ ఏమిమాట్లాడాడు.

రాధ

ఏముంటుంది ? ఏమీ లేదు.

సత్యనారాయణ

అతని ముఖం చూచాను. ఏమీ-లేదంటే నేను నమ్మగలనా. ఎందుకీ దాపరికము.

రాధ

వారికి తోచినసహాయం చేస్తానన్నారు.

సత్యనారాయణ

ఏమి సహాయం. జగన్మోహినికి అప్పజెపుతానన్నాడా ?

రాధ

(పటుక్కున నవ్వుతుంది)

సత్యనారాయణ

తరవాత నీవు చెప్పనక్కరలేదు. 'అతని ముఖమే చెప్పింది. (నవ్వు ఆపి) దారిలో రాఘవరావుగారింటికి వెళ్లబోయి మానివేశాను. నీతో మొదట మాట్లాడి నీ అభిప్రాయం కనుక్కున్న వెనక వెళ్లవచ్చునని.

రాధ

వారితో నా కేసంబంధము లేదు...తమరు వెళ్ల నవసరము లేదు.

సత్యనారాయణ

(కొంచెము సేపు ఊరకుండి) రాధా! ఏమిచేయడానికి నిశ్చయించావు ?

రాధ

ఆప్రశ్నకు సమాధానం చెప్పేస్థితిలో వున్నానా నేను ?

సత్యనారాయణ

(హఠాత్తుగా) అయితే రాఘవరావుగారి కుమారునిపై నీ ప్రేమ నశించిందా ?

రాధ

ప్రేమనా ?...ప్రేమస్వరూపమే తెలియని రోజుల్లో నా భావాలకి అర్థ తాత్పర్యాలు లేవనుకోండి. ప్రేమస్వరూపం తెలుసుకున్నప్పుడు ప్రేమ లేదని నిశ్చయించాను.

సత్యనారాయణ

నిజంగా ?

రాధ

అబద్ధమాడగల ధైర్యంలేదు నాకు.

సత్యనారాయణ

ఇప్పుడు ప్రేమస్వరూపం తెలుసుకున్నావా ?

రాధ

(సిగ్గుతో తల వంచుకుంటుంది.)

సత్యనారాయణ

ఏంచెయ్య నిశ్చయించానో అడగరాదూ ?

రాధ

చెప్పండి.

సత్యనారాయణ

(నవ్వుతూ) రాధా...పతి కావడానికి (నిష్క్రమణ.)

రాధ

(గుమ్మమువంక చూస్తూ నిలబడుతుంది ఆనందంతో)—

తెర.



రంగము 3. మొదటి రంగములోని గది.

[ వెంకటసుబ్బయ్యగారు పచారుచేస్తూ మాట్లాడుచున్నాడు. కామేశ్వరమ్మ నిలబడి వున్నది. సుబ్బమ్మ గుమ్మం దగ్గిరగా వున్నది.]

వెంకటసుబ్బయ్య

ఏమిట్రో! ఇంతవరకు నీమాటలు విని శాంతించాను. ఇక అలాజరగదు.... శ్రుతి మీరిపోతూవుంది.

సుబ్బమ్మ

నేను అప్పుడే చెప్పాను వదినెగారితో.

వెంకటసుబ్బయ్య

అంతమాత్రం బుద్ధి ఉంటేగదూ.

కామేశ్వరమ్మ

అయ్యో! నన్నేమి చెయ్యమంటారు. దానిస్థితిమాస్తే ఘోషగావుంది. లోకానికి భయపడవలసిందే, కాదంటానా? మన అబ్బాయి...

వెంకటసుబ్బయ్య

ఆవట్టి వెధవ కేమి తెలుస్తుంది.

సుబ్బమ్మ

పసితనంకదూ. యుక్తాయుక్తాలు బోధపడుతవా మరి.

(లోపలినుంచి ప్రవేశం సత్యనారాయణ. తక్షణమే సుబ్బమ్మ నిష్క్రమణ)

సత్యనారాయణ

ఏమమ్మా! అలానిలబడ్డావు?

కామేశ్వరమ్మ

ఏముంది నాయినా! మీ నాన్నగారు మాట్లాడుతూవుంటే వింటున్నా.

వెంకటసుబ్బయ్య
సత్యం! నీవు చేసినపని ఎంత ఖంగారు పెడుతూవుందో నన్ను చూశావా?

సత్యనారాయణ
తప్పుపని ఏంచేశాను నాన్నా.

వెంకటసుబ్బయ్య
అల్లా బృహస్పతిలాగ మాట్లాడకు.

కామేశ్వరమ్మ
కోప్పడుతా రెందుకండీ?

వెంకటసుబ్బయ్య
అప్పుడే పట్టణంలో సగంమందినోట్లో పడ్డది నా పేరు. ఇంకా ఏమితప్పు చేశామని అంగలార్చడమా? ఈ విషయం జడ్జీగారికి తెలిసిందా ఉద్యోగానికే ముప్పొస్తుంది.

సత్యనారాయణ
ఏమి చెయ్యదలుచుకున్నారు?

వెంకటసుబ్బయ్య
ఏం చెయ్యడమని ప్రశ్నకూడానా. ఏంచేస్తాననుకున్నావు. ఇంట్లో నెత్తి మీద పెట్టుకొని పోషిస్తాననుకున్నావా? ఇల్లను కొన్నావా?...సత్రమను కొన్నావా?

సత్యనారాయణ
అయితే

వెంకటసుబ్బయ్య
అయితే లేదు. గియితే లేదు: ఇక పది ఘడియలుంచుకోను నాయింట్లో.

సత్యనారాయణ
ఎక్కడికి వెళ్లమంటారు?

వెంకటసుబ్బయ్య

ఇక్కడిలా రమ్మన్నాము గనుకనా మనం? ఎక్కడికైనా వెళ్ళుతుంది. ప్రస్తుతం నాయింట్లోనుంచి వీధిలోకి వెళ్ళుతుంది.

సత్యనారాయణ

ఆ! అంత క్రూరంగానా?

వెంకటసుబ్బయ్య

ఏమన్నావు! క్రూరమా! నీకేమి తెలుస్తుంది! జడ్జీగారికీ సంగతంతా తెలిస్తే నీకూ, నాకూ ఉద్యోగాలు పోతవి.

సత్యనారాయణ

ఉద్యోగాలకీ ఈ విషయానికీ ఏమి సంబంధం నాన్నా! జడ్జీగారు అంత మూర్ఖంగా వర్తిస్తారా?

వెంకటసుబ్బయ్య

నీతో నేను వాదం పెట్టుకోవలసినంత కారణం లేదు. ఇది నా యిల్లు. నా ఆజ్ఞమించి ఏదీ జరగదు. అధికప్రసంగం మాని నీ పనేదో నీవు చూచుకో.

కామేశ్వరమ్మ

అయ్యొయ్యో! ఎందుకండి అబ్బాయి నంత కసిరేస్తున్నారు.

వెంకటసుబ్బయ్య

మరెందు కీశవభిషలు. ఇప్పుడు దాన్నేమి చెయ్యగలం?

సత్యనారాయణ

(నెమ్మదిగా) నేను వివాహం చేసుకొంటాను.

వెంకటసుబ్బయ్య

(నిర్ఘాంతపడి) ఆ! ఆ! ఏమీ!

సత్యనారాయణ

అవును! నేను వివాహం చేసుకొంటాను. అప్పుడు ఏ ఆక్షేపణ ఉండదు కదా.

వెంకటసుబ్బయ్య

దాన్నా! నీవా! మతిపోయిందా!

సత్యనారాయణ

మతి ఉపయోగించే చెప్పాను.

వెంకటసుబ్బయ్య

అనడవడిక గలదాన్నా!

సత్యనారాయణ

నేను ఆవిడ గుణగణాలు బాగా పరిశీలించాను. ఆవిడ శీలం బాధలుపడడం చేత నిర్మలమైంది. ఆవిడకు గల ధైర్యం ఏ విచారమూ లేక మూలకూర్చున్న మన పిల్లలకన్న ఎన్నో రెట్లు ఎక్కువైనది.

వెంకటసుబ్బయ్య

(ఉగ్రమూర్తియై) ఒరే! ఒరే! నామాటకు వ్యతిరేకంగా చెప్పడంకాకుండా నాకు చదువు నేర్పుతున్నావుగా! నాకు దాని పాతివ్రత్యం వర్ణిస్తున్నావా? కుర్రవాడవని పస్తాయిస్తే వ్యవహారం మీరిపోతూ వుందే.

సత్యనారాయణ

కుర్రవాడైతేమాత్రం స్వబుద్ధి ఉపయోగించ కూడదా?

కామేశ్వరమ్మ

నాయనా, నాయనా! నెమ్మదిగా. నాన్నగారితో అలామాట్లాడ వచ్చునా! తప్పుగదా.

వెంకటసుబ్బయ్య

మాటాడనీ, వాడు నా కొడుకుగాడు......వెళ్లిపొమ్మను. దానితో కలిసి.........

(అప్పుడు ప్రవేశం రాధ—మేడమీది నుంచి దిగి వచ్చింది.)

రాధ

కామమ్మగారూ! విన్నాను కొంతవరకు. ఇదుగో నమస్కారం, అందరికిని, ఇంత

మాత్రం సహాయం చేసినందుకు ఇదా నేను చేసినలాభం...మీలో మీరు దెబ్బలాటలా... సెలవు...నామూలాన్ని మీరెందుకు బాధపడడం......

సత్యనారాయణ

అమ్మా! నేను సహా వెళ్లిపోతూ వున్నాను.

కామేశ్వరమ్మ

ఆఁ ఆఁ నాయినా (చేతులుపట్టుకొంటుంది)

సత్యనారాయణ

అవును. లేకపోతే నేను మీకుమాఋణ్ణిగాను! ఈ విధంగా ఈవిడను వేధిస్తాలుచేస్తుంటే చూచి నేను ఊరుకుంటే సిగ్గునాదికాదు, మీదే......

రాధ

మీకు నమస్కారం. వద్దు. నాబాధలు నేను పడతాను లెండి.

వెంకటసుబ్బయ్య

ఓహో! ఎంతకు వచ్చింది! వెళ్లు వెళ్లు, మళ్లి నా మోహం చూడవద్దు. నాకు కొడుకేలేడు, లేడు: (తడబడుచూ నిష్క్రమిస్తాడు.)

కామేశ్వరమ్మ

అయ్యయ్యో! ఇదేమి ఆగడం నాయినా.

సత్యనారాయణ

అమ్మా! నాదేమీలేదు. ఇంతకన్నా నేనేమి చెయ్యాలను. రాధా, ఉండు: ఇప్పుడే వచ్చేస్తాను. (మేడమీదికి వెళ్లును.)

రాధ

(ఏడుస్తూవుంగ) అమ్మా! నన్నెప్పుడైనా క్షమిస్తారా?

కామేశ్వరమ్మ

నాకర్మమమ్మా నాకర్మం...నిన్నేమనగలను నీ స్థితి చూస్తూ.

రాధ

మీతో మళ్లీ మాట్లాడే భాగ్యం ఉంటుందో లేదో...[నమస్కరిస్తూ] మీరు చూపించిన దయమరచిపోలేను...బంగారుకంటి హృదయం మీకుండేటే మాత్రం ఏమి ప్రయోజనం, నాదౌర్భాగ్యం; లోకానికి వెరవవలసివుంటుంది కదా.

కామేశ్వరమ్మ

అమ్మా! నా మనసు బాగా గ్రహించావు.

[పునఃప్రవేశము సత్యనారాయణ, ప్రయాణానికి సిద్ధమయి. చేతిలో బట్టల పెట్టె ఉంది.]

సత్యనారాయణ

అమ్మా! కావలసినవి కొన్ని బట్టలు తీసుకొని వెళ్తున్నాను. తరువాత నా వస్తువులన్ని పంపించెయ్యి...కోపం చేసుకోకు.

కామేశ్వరమ్మ

నాయనా! [ఏడుస్తూ] ఇంతేనా! మళ్లీ ఎప్పుడు కనబడతావు ?

సత్యనారాయణ

ఎప్పుడైనా...సిద్ధంగా...నాన్నకూ నీకూ నా మీద అనుగ్రహం వచ్చిన నాటికి.

కామేశ్వరమ్మ

[దుఃఖంచేత మాటలురావు.]

సత్యనారాయణ

అమ్మా! సెలవు. [నమస్కరించి] రాధా, రా! [రాధకూడా కామేశ్వరమ్మకు నమస్కరిస్తుంది. ఇద్దరు నిష్క్రమిస్తారు.]

కామేశ్వరమ్మ

[గబాగబా గుమ్మంవద్దకి వెళ్లి చూస్తుంది, కొంతసేపటికి మళ్లీవచ్చి కూలిపోతుంది.]

తెర



## రంగము 4

[ప్రస్తుతం సత్యనారాయణ, రాధ కాపురంఉన్న గృహంలో గది. మంచం, బల్ల, రెండు కుర్చీలు, వస్తువులు ఎక్కువగా లేకపోయినా శుభ్రంగావుంది.]

రాధ

(బల్లపైన కలంకారి ఖండువాపరిచి, పండ్లతో పళ్లెము, కాఫీ గిన్నెలు పెడుతూవుంది.)

(ప్రవేశము సత్యనారాయణ, చాలా మారిపోయాడు. చిక్కి వాడిపోయింది ముఖం.)

సత్యనారాయణ

(కోటు తీసి మంచంమీద పారవేసి కుర్చీపై కూర్చుంటాడు.)

రాధ

కాఫీ తెమ్మంటారా ?

సత్యనారాయణ

ఊఁ

రాధ

(కాఫీ తెచ్చి అందిస్తుంది.)

సత్యనారాయణ

(మెల్లగా త్రాగుతూ చేతిగుడ్డతో ముఖం తుడుచు కుంటున్నాడు.)

రాధ

(చిరునవ్వు బలవంతంగా తెచ్చుకొని) ఇవ్వేళ ఏమైనా ప్రయత్నం కొనసాగిందా?

సత్యనారాయణ

ఓ. కొనసాగినట్లే, ఏ ఆఫీసులో ఖాళీలు లేవన్నారు. కలెక్టరు ఆఫీసులో

ఉందని ఒకడన్నాడు కాని వెంటనే రాఘవరావుగారి బావమరిది నన్ను చూచి లేవని చెప్పించాడు.

రాధ

మరి కొనసాగిందన్నారు?

సత్యనారాయణ

ఆ! సాయబు దుకాణంలో ఇంగ్లీషు ఉత్తరాలు అవి వ్రాయడానికి గుమాస్తాగా చేరాను. ఏదో వొకటి.

రాధ

అబ్బబ్బ! ఎంతకష్టం—నామూలాన్ని.

సత్యనారాయణ

(గిన్నె క్రిందపెట్టి) అదుగో! ఆ మాటే కదా అనవద్దని ఎన్నిమాట్లు చెప్పాను. ఆ మాటంటే నా ఉత్సాహమంతా నశించిపోతుంది. ఎన్నిబాధలున్నా సంతోషంగా కాలం గడపగలను కాని నీవామాట మాత్రం అనకు.

రాధ

ఆహా! ఎంత సంతోషం అనుభవిస్తున్నారు! నా కళ్లకు గంతలు కట్టుకొమ్మంటారా? మిమ్మి చూస్తూ నే నెలా భరించగలను? ఆ చెక్కులు ఎంత చిక్కిపోయాయో! ఆ కళ్లల్లో నిరాశ, విసుగు, అలసట ఇవి తప్ప ఏమైనా కనబడుతున్నదా?...అబ్బా! తిన్నగాచూస్తే గుండె బద్దలై పోతుంది, మూడుమాసాలు కాలేదు. ఇంతలో ఇంతస్థితికి వచ్చారు... కారణం?... నేను కానా... నేనుకానా... కానని చెప్పగలరా? మీరుచెప్పినా, నమ్మగలనా?

సత్యనారాయణ

(కండ్లు మూసుకొని వింటున్నాడు.)

రాధ

కని పెంచి పెద్దవాణ్ణిచేసిన తల్లితండ్రులపైకి మీ మనసు పోవడంలేదంటే నేను నమ్ముతానా? దారిలో దొరికినదాన్ని నామీద జాలిగొన్న మీరు

వారిమీద ప్రేమ మాయమయిందంటే ఏలా నమ్మగలను...ఘోరపాపం చేస్తున్నాను. వారెంత దుఃఖిస్తున్నారోగదా...అంతకూ కారణం నేను కానా?

సత్యనారాయణ

అయితే—

రాధ

నేను నాదారిని వెళ్లిపోతాను. సృష్టించిన వాడు పోషించ లేకుండా పోతాడా. మీ వాళ్ల దగ్గరికి వెళ్లిపొండి ఇప్పుడే... ఈక్షణం.

సత్యనారాయణ

(లేచి, కొంచెం కఠినంగా) రాధా! నే నంత మాటనిలకడ లేనివాడ నను కొంటివా? నేను మా వారింటికి వెళ్లననలేదే...తప్పకుండా వెళ్తాను. అయితే నేను మాత్రంకాదు...నీతో సహా. అంతే.

రాధ

అంతభాగ్యపు రోజులకే ఎదురు చూస్తుంటాను లెండి (నిట్టూర్పు) [తలుపుతలనుండి 'ఏ మండోయి']

సత్యనారాయణ

ఎవరది. దుకాణంనుంచి ఏదైనా జరూరు కబురుకాబోలు (గట్టిగా) రావచ్చు.

[ప్రవేశం వెంకటసుబ్బయ్యగారి నౌఖరు]

సత్యనారాయణ

(ఆదుర్దాతో) ఏమిరా.

నౌఖరు

అమ్మగారిమ్మన్నారండీ (జాబిస్తాడు.)

సత్యనారాయణ

(తీసుకొని చదువుకొంటాడు. చేతులు వణుకుతూ వున్నవి) వెంటవే వస్తున్నానని చెప్పు.

నౌఖరు

చిత్తం. (నిష్క్రమణ.)

సత్యనారాయణ

రాధా! నాన్నగారికి చాలాజబ్బుగా వుందట. అమ్మ వ్రాసి పంపింది. నన్ను చూడవలెనని ఆపేక్షతో వున్నారట. నేను వెళ్తాను...ఏదీకోటు?...

రాధ

(కోటు తెచ్చి తొడుగుతుంది.)

సత్యనారాయణ

మళ్లీ వొచ్చేస్తాను...ఇప్పుడే.

(నిష్క్రమించును)

రాధ

(గుమ్మంవరకూ వెళ్లి, మళ్లీ వెనకకువచ్చి కిటికీలోనుంచి చూస్తుంది సత్యనారాయణ వెళ్లడం......తరువాత గోడకుతగిలించివున్న ఫోటో దగ్గిరనిలబడి చూస్తూవుంటుంది. తటాలునతీసి ముద్దుపెట్టుకుంటుంది. మళ్లీ తగిలించేసి నమస్కరిస్తుంది...అంతే...త్వరగా తలుపుతీసుకొని బయటికి వెళ్లిపోతుంది)

తెర



(రంగము 5:—వెంకటసుబ్బయ్యగారి మేడమీదిగది)

(వెంకటసుబ్బయ్య మంచంమీద పడుకున్నాడు. కామేశ్వరమ్మ ప్రక్కన నిలబడివుంది.)

వెంకటసుబ్బయ్య

ఒసే! వచ్చాడా?

కామేశ్వరమ్మ

వస్తాడండీ. ఇప్పుడేగదూ నౌఖరు వచ్చాడు.

వెంకటసుబ్బయ్య

వస్తాడో లేడో.

కామేశ్వరమ్మ

మందు పుచ్చుకొంటారా?

వెంకటసుబ్బయ్య

ఎందుకే ఆ చేదునీళ్లు...ఇది మనోవ్యాధి...దీని కేమందు లేదు.

కామేశ్వరమ్మ

అయితే ఇక తగ్గిపోతుం దన్నమాట.

వెంటసుబ్బయ్య

మళ్లీ వస్తాడావాడు? మళ్లీ మనయింట్లో వుంటాడా? వాణ్ణి ఎంతబాధ పెట్టాను...ఎంత అన్యాయం చేశాను.

కామేశ్వరమ్మ

నే నప్పుడే ఎరుగుదును, తరువాత మీరు పశ్చాత్తాప పడతారని...

వెంకటసుబ్బయ్య

ఎందుకు చెప్పలేదు మరి?

కామేశ్వరమ్మ

ఇప్పు డడుగుతారు గాని అప్పుడు నా మాట ఎవరు పాటించేవారు. ఆడదాన్ని.

వెంకటసుబ్బయ్య

మగవారి బుద్ధి ఇలా వెలుగుతూవున్నది గనక.

కామేశ్వరమ్మ

పాపం చాలా చిక్కిపోయాట్టండి. నౌఖరు చెప్పాడు.

వెంకటసుబ్బయ్య

కాదూ మరి. నన్నెంత దూషించాడో కదా.

కామేశ్వరమ్మ

అబ్బా! అలాటివాడు కాడండి.

వెంకటసుబ్బయ్య

అవును. అందుకే నాకు మరీచింత. దూషించేవాడైతే ఇంత బాధపడకేపోదును.

కామేశ్వరమ్మ

ఇప్పుడు వచ్చినప్పుడు ఏమి చెప్పదలుచుకున్నారు?

వెంకటసుబ్బయ్య

ఇంకా అడుగుతా వెందుకు?

కామేశ్వరమ్మ

నిజంగా?...అమ్మోయి! నాకు కోడలు కూడా వస్తుంది. చేతికందినకోడలు కూడాను. రాధ నా నేస్తంకూతురు ఎరుగుదురా?

వెంకటసుబ్బయ్య

(తొందరపడకు.)

కామేశ్వరమ్మ

(మెట్లమీద చప్పుడు విని) అదుగో! (గుమ్మంవద్దకి వెళ్లుతుంది.)

(ప్రవేశం సత్యనారాయణ)

సత్యనారాయణ

అమ్మా! (చేతులు గట్టిగా పట్టుకొని) నాన్న కెలా వుంది?

కామేశ్వరమ్మ

అదుగో చూడు. నీకోసం కలవరిస్తున్నారు.

వెంకటసుబ్బయ్య

(లేచి కూర్చున్నాడు)

సత్యనారాయణ

(సమీపంగా వెళ్లి తలవంచుకొని నిలుచుంటాడు.)

వెంకటసుబ్బయ్య

నాయనా! నన్ను క్షమించావా ?

సత్యనారాయణ

అయ్యయ్యో! ఎంతమాటన్నారు! నన్ను మీరు ఏరోజు క్షమిస్తారో అని కాచుకున్నప్పుడు—నేనా క్షమించడం ?

వెంకటసుబ్బయ్య

నీవు తప్పు చెయ్యలేదే. ఎందుకని క్షమించను ?

సత్యనారాయణ

ఇంతభాగ్యం కలుగుతుందని అనుకోలేదు.

వెంకటసుబ్బయ్య

నాయనా! నీవు అనుభవించకపోతే ఎందుకు మా కీభాగ్యం.

కామేశ్వరమ్మ

వాడికిమాత్రం తెలియదటండి!

వెంకటసుబ్బయ్య

ఇవ్వేళే వచ్చెయ్యాలిసుమా.

సత్యనారాయణ

(పలకడు)

వెంకటసుబ్బయ్య

ఏమీ ? ఏమి చిక్కు ?

సత్యనారాయణ

నాన్నా ! నన్నర్థం చేసుకో లేదేమో...బాగా...

వెంకటసుబ్బయ్య

(చిరునవ్వుతో) లేదు, నాయనా, పూర్తిగా అర్థంచేసుకున్నాము.

సత్యనారాయణ

(వారి అభిప్రాయం స్ఫురిస్తుంది) నిజంగా ?

వెంకటసుబ్బయ్య

సందేహంకూడానా...,అంతమాత్రం నన్నర్థం చేసుకోలేక పోయావా ?

సత్యనారాయణ

(సంతోషంతో) ఇంతదయకు పాత్రుణ్ణి కానేమో!...మరి లోకమో ?

వెంకటసుబ్బయ్య

లోకంకన్నా నా 'సత్యం' ఎక్కువని కనుక్కున్నాను.

కామేశ్వరమ్మ

వెళ్లిరానివ్వండి...ఆలస్య మెందుకు ?

వెంకటసుబ్బయ్య

త్వరగావస్తారు కదూ.

సత్యనారాయణ

తక్షణం...అమ్మా ! వెళ్తాను. (నిష్క్రమణ)

(వెంకటసుబ్బయ్య కామేశ్వరమ్మ కొంచెంవరకు మాట్లాడరు)

వెంకటసుబ్బయ్య

ఏమిటాలోచిస్తున్నావు. కోడలికి ఏంసొమ్ములు చేయిస్తామనా ?

కామేశ్వరమ్మ

సరేలెద్దురు. మీకుమాత్రం సంతోషంగాలేదా ? మెత్తగావున్నారని వేళా కోళం చేస్తారు.

వెంకటసుబ్బయ్య

అబ్బా ! సొడుపడేట్టుండేది మనయిల్లు.

కామేశ్వరమ్మ

మన మేగా చేసుకొన్నది. మీచెల్లెలి మాటవిన్నారేగాని నామాట విన్నారా? ఆవిడకు మంచిపరాభవమే అయిందిలెండి. విన్నారా......ఊరంతా అల్లుకుంది.

వెంకటసుబ్బయ్య

ఏమి జరిగింది ?

కామేశ్వరమ్మ

సుభద్ర కిరస్తానంలో కలిసిపోయిందట.

వెంకటసుబ్బయ్య

ఆ! ఆ !

కామేశ్వరమ్మ

కలిసిపోయి మద్రాసు వెళ్ళిపోయిందని కూడాననంటా.

వెంకటసుబ్బయ్య

ఎందుకంత ?

కామేశ్వరమ్మ

ఆవిడకు:డవడికి ఏమీ బాగుండేది కాదండీ. మనయింట్లో వున్నప్పుడే...... ఇక్కడినుంచి వెళ్ళాక మరీ ఎక్కువైందట. మనవాళ్ళదగ్గిర ఇక పరువు నిలవ దనుకొన్నది కాబోలు.

వెంకటసుబ్బయ్య

సుబ్బికి పాపం అంత్యకాలానికి ఎంతదుఃఖం !

కామేశ్వరమ్మ

లక్షణంగా ఎక్కడికో ఒకడికి—ఆ ఆలమూరివారి అబ్బాయికే అనుకోండి—ఇచ్చి వివాహం చేసివుంటే సవ్యంగా వుండిపోయేది కదా!

వెంకటసుబ్బయ్య

ఓహో! సంప్రదాయస్థురాలివై పోతూ వున్నావే!

కామేశ్వరమ్మ

అవును మరి. కాలాలు మారిపోతూ వుంటే ధర్మాలు మారవద్దూ. కానీ, ఎక్కడ మారనిస్తారు?......చంపేస్తారు విరుద్ధంగా నడుచుకుంటే.

వెంకటసుబ్బయ్య

ఏమిటే? ఇంకా రాలేదు అబ్బాయి.

కామేశ్వరమ్మ

అవునండీ...బహుశా బండిదొరికిందికాదేమో...లేదు. అదుగో చప్పుడు.

వెంకటసుబ్బయ్య

(విని) అబ్బే కాదు. వెంకటేశం వస్తున్నాడు.

వెంకటేశ్వర్లు

(ప్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా! ఎంతఘోరం జరిగిందో విన్నావా?

కామేశ్వరమ్మ

(తొట్రుపాటుతో) ఏమిట్రా!

వెంకటేశ్వర్లు

రాధ (సంకోచంతో) మన అబ్బాయి......

కామేశ్వరమ్మ

ఔను...ఏమైంది రాధ......

వెంకటేశ్వర్లు

బజారుదగ్గిర దిగుడుబావిలో పడి చచ్చిపోయింది.

(వెంకటసుబ్బయ్య, కామేశ్వరమ్మ హాఁ హాఁ అంటారు.)

వెంకటేశ్వర్లు

ఖైటికి లాగేశారు. మన సత్యం అక్కడే ఉన్నాడు. బండి కట్టించుకొని ఇక్కడికే వస్తాడనుకుంటూ. ఘోరం కదూ...మంచిపిల్లసుమా...అబ్బాయి పిచ్చెక్కినట్లు అయిపోయాడు.

వెంకటసుబ్బయ్య

(తల రెండు చేతుల్తోపట్టుకొని) రామ రామ! (మెల్లగా తలగడపై ఆను కుంటాడు కూలిపోయి.)

కామేశ్వరమ్మ

(నడుము విరిగిపోయింది. దుఃఖాతిశయంచేత కళ్లల్లో నీళ్లులేవు. కూర్చుంది రప్పలాగ.)

[హఠాత్తుగా ప్రవేశం సత్యనారాయణ.]

సత్యనారాయణ

(గుమ్మంలో నిలబడి) అమ్మా! (ముఖంలో నెత్తురుచుక్క లేదు. చూపులో ఒక వెఱ్ఱినిశ్చలత్వం వుంది.)

కామేశ్వరమ్మ

(గద్గదస్వరంతో) నాయనా!

సత్యనారాయణ

అమ్మా! కోడల్ని తీసుకొనివచ్చానమ్మా. అయితే తానే స్వయంగావచ్చి నీకు నమస్కారం చేయగలస్థితిలో లేదమ్మా!

కామేశ్వరమ్మ

తెలుసు నాయనా, ఇలా రా!

సత్యనారాయణ

(ఇక భరించలేక ఉరకడితో వచ్చి ఒడిలో తలదాచుకొని ఏడుస్తున్నాడు.)

కామేశ్వరమ్మ

(తలనిమురుతూ) నాయనా! పిచ్చినాయనా! మనం వున్నలోకంసంగతి నీవు ఎరగలేదు సుమా...ఈలోకం ఒక పెద్ద బోనులాంటిది. దాని కమ్ములు వాడికత్తులు...బాగా పదనుపెట్టిన కత్తులు నాయనా...బలవంతంగా తప్పించుకోడానికి ప్రయత్నిస్తే ఏమవుతుంది...చేతులూకాళ్లూ కోసుకపోతవి...దేహం రక్తంతో తడిసిపోతుంది...అంతే...తప్పించుకొని మాత్రం పోలేము...మనకు మిగిలేది బాధే!...(అంటూ కళ్లుమూసుకుంటుంది. కన్నీళ్లు ధారలుగా కారిపోతూవున్నవి.)

తెర

సమాప్తము



[మేడమీద గది. విశాలంగానే ఉంది. ఒకమూల మంచం. మంచాని కెదురుగోడంతా అద్దాల కిటికీలు. కొన్ని తెరువబడి, కొన్ని మూసి ఉంటవి. మంచానికిప్రక్క బల్ల, బల్లమీన మందు సీసాలు, గ్లాసులు వగైరా.]

కాలం సాయంత్రం, రంగం నడిచేకొద్దీ చీకటి పడుతుంది.

మంచంమీద వేణుగోపాలరావు పడుకున్నాడు. వయస్సు 30 కి మించి లేదు. దీర్ఘరోగపీడితుడని అతని దౌర్బల్యమే చెప్పుతూవుంది. అయినా ముఖములో తేజస్సుంది. కళ్లలో కాంతి అప్పుడప్పుడు ప్రకటన అవుతుంది. బాధచేత బొమలు పైకెత్తినప్పుడు విశాలమైన నుదుటి ముడతలు కనబడతవి ...వేణు ఒంటరిగా చూస్తున్నాడు కిటికీగుండా అస్తమయ సౌభాగ్యం. ప్రవేశం రామలక్ష్మమ్మ, అతని తల్లి. విధవరాలు, అయినా జుట్టుంది. నున్నని నల్లనివెంట్రుకలలో అక్కడక్కడ జరీపోగులు కలిసిఉన్నవి. గాంభీర్యమూ ఉంది సౌలభ్యము ఉంది ఉనికిలో, చేష్టల్లో, చూపుల్లో.]

రామ

నాయనా! ఆరు వేశారు. మందు పుచ్చుకోవూ? (బల్లదగ్గిర గ్లాసులో ఒక సీసానుంచి మందు వంచబోతుంది.)

వేణు

(కొంచెం దీనంగా) అమ్మా!

రామ

ఏమి నాయనా!

వేణు

వద్దు. ఇవ్వేళ మందువద్దు...చూడు! నీకేమీ పనిలేకపోతే ఇక్కడ కొంచెంసేపు కూర్చో...నాకేమీ తోచడంలేదు.

రాము

అలాగే నాయనా! (ప్రక్కన కుర్చీవేసుకొని కూర్చుంటుంది. కొంతసేపు ఇద్దరూ మాట్లాడరు.)

వేణు

అమ్మా! నాజన్మమంతా ఇంతే కదమ్మా.

రాము

ఏమి మాటలు నాయనా.

వేణు

అయ్యో! నాకు తెలియదటే...

రాము

(దుఃఖం ఆపుకొని) నీకేమి తెలుస్తుందిరా. మన డాక్టరుగారు చాలా గొప్ప వారంటారు. నీమీద ఎక్కువ ఇష్టంకూడాను. త్వరగా లేచి తిరుగు తావులే నాయనా.

వేణు

(కొంచెముసేపు ఊరుకొని) అమ్మా! శారద పాపం చాలా కష్టపడుతూ ఉందికదూ నావల్లాన్నూ.

రాము

(అనాలోచితముగా) అబ్బే! లేదు నాయనా.

వేణు

ఆఁ అదీ దాంకావు. అదేనమ్మా నిన్నడగాలని. నీ అభిప్రాయం చెప్పక పోతే ఒట్టు...

రాము

ఎందులో?

వేణు

శారద విషయంలో.

రాము

(స్వల్పంగా చలించి) అంటే?

వేణు

శారదలో మార్పు కనబడుతూ వుంది, కొన్నాళ్లగా...నాలుగైదు మాసాలుగా. నాకు జబ్బుచేసిన మొదటిరోజుల్లో అబ్బా! ఏమి ఏడ్చేది... రోజుకు ఒక్కసారైనా అన్నం ముట్టుకునేదికాదు కదూ! జ్ఞాపకం లేదూ?

రాము

ఊఁ.

వేణు

డాక్టరుకూడా వకసారి మందలించాడు "ఏదటమ్మా పతివ్రతాధర్మం. పతికి పరిచర్యచెయ్యడానికైనా ఒంట్లో సత్తువ ఉండవద్దటమ్మా" అని......... పాపం, రోజూ రాత్రిళ్లు నేను నిద్రించేవరకు ప్రక్కనే కనిపెట్టుకుని ఉండేది. అవునా?

రాము

అవు నిదంతా ఎందుకునాయనా ఇప్పుడు!

రాము

(వినిపించుకోకనే) నాకు చాలా జాలివేసేది. ఆకుసుమసుకుమారమైనదేహం కృశించిపోవడం చూసినప్పుడు నామీద నాకు కోపంవచ్చేది. కారణం నా వ్యాధికదా అని...ఆ లేడికళ్లల్లో నీళ్లు గిర్రుమని తిరిగితే నాకడుపులో చేతులువేసి కలబెట్టినట్లు బాధపడేవాడిని...

రాము

(ధోరణి త్రిప్పేయడానికి) చీకటి పడుతోంది. దీపం వెయ్యనా?

వేణు

వద్దు, వద్దు...వినదూ...అలా ఉండేదా. మన సత్యం పరీక్షలు కాగానే వచ్చినప్పుడు చూచి ఆనవాలుకూడా పట్టలేకపోయాడు...అతనువాతేకదూ నేనుకూడా మందలించి ఇంతచిన్నతనంలో, ఎల్లప్పుడూ రోగిదగ్గరనే ఉంటే తప్పుఅని ఇతరవిషయాల్లో కొంచెం ఆసక్తి తీసుకోనేటట్టు చెయ్యరా మీ వదినగార్ని అని సత్యంతోకూడా అన్నాను.

క్రూరంగా బాధపడతానా...కాదుకాదు...(గద్గదస్వరంతో) అదికాదు... శారదకు నామీద ప్రేమే పోయింది.

రామ

ఛీ! ప్రేమ లేవిట్రా...నాటకాల్లో కావ్యాల్లోలాగ......ఇంకేమైన మాట్లాడకుందాంరా...లేదా గ్రామఫోను వింటువుగాని.

వేణు

వద్దు వద్దు నాకు సంగీతం వింటే ఒళ్లంతా మండుకుపోతుంది. వద్దు... అమ్మా...అమ్మా!...ఏమనుకోవుగదూ నేనొకమాట అంటే...ప్రేమంటే ఆక్షేపించావు. అయితేచెప్పు, నాయన నిన్ను పెళ్లాడినట్లేనా నేను శారదని పెళ్లాడింది...నాయన నీవెనగో తెలియకుండానే మూడుముళ్లువేశాడు... నేనుశారదను కోరి ప్రేమించి అనురాగంతో వివాహం చేసుకున్నాను...

రామ

ఇప్పుడుమాత్రం ఏమైనా యనా. ప్రేమ ఎక్కడికి పోతుంది?

వేణు

లేదమ్మా. లేదు. నే నెరగనూ? ప్రేమ నశించిపోయింది... శారదకు నా మీద ప్రేమ నశించింది...నాజీవితంలో ఆనందలక్ష్మి వెళ్లిపోయింది... నాహృదయాకాశంలో ఇప్పుడు చంద్రుడు లేడు...నిండు అమావాస్య...

రామ

నేనేమిచెప్పను, నీ వంతపిచ్చిగా మాట్లాడుతూ వుంటే?

వేణు

(అమ్మచేతులు గట్టిగ పట్టుకొని, గద్గదస్వరముతో) అయితే...అమ్మా! అమ్మా!...ఒకవేళ శారద ఇంకొకణ్ణి ప్రేమించినట్లు తెలిసిందా. అబ్బా... ఓర్చుకోలేను...ఆపుకోలేను...అప్పుడు నారక్తనాళాల్లో రక్తం ప్రవహించదు...అగ్నిజ్వాలలు పరుగెత్తుతవి. అబాధ పడలేను.

రామ

(ఆ పశ్చాత్తాపంలో ఎంత ఆలోచన ఉందో ఎవరికి తెలుసును. ప్రేమగాలున చిరునవ్వుతో) ఛీ! ఎంత వెర్రిరా, అబ్బాయి, ద్రోహం చేసిందాన్ని అలా భావించడం...నిజం చెప్పనా!

వేణు

చెప్పు, చెప్పు, త్వరగా చెప్పు.

రామ

ఇదంతా నా తప్పే...శారద అలా విచారంగా ఉంటే నీవు బెంగపెట్టుకోవడం చూచి డాక్టరు నాతో అన్నాడు: "మీరెల్లాగైనా ఆవిడను కొంత సరదాగా ఉండేటట్లు చెయ్యాలి...అప్పుడుగాని అబ్బాయికి శాంతి ఉండదు. శాంతి ఉంటేగాని మందులు పని చెయ్యవు" అని. అందుచేత మే మందరమూ చిలకకు చెప్పినట్లు చెప్పి బ్రతిమాలి ఆవిణ్ణి మెల్ల మెల్లగా నీదగ్గిరే ఉండకుండా చేయించాము...పాపం! అదేమి చెయ్యగలదు.

వేణు

నిజంగా? నిజంగా! కల్పిస్తున్నావు.

రామ

పోనీలే! నమ్మకపోతే.

వేణు

కాదే. నిజంగానా అని సంతోషంచేత అడిగానే......(కళ్ళుమూసుకొని) అబ్బ! ఎంతకష్టపడ్డాను....

రామ

పిచ్చినాయన...కొంచెం పాలుపుచ్చుకో. (పాలు త్రాగిస్తుంది.)

వేణు

(త్రాగి) అబ్బబ్బ! (అని గుండెపట్టుకొని) చాలా బాధగా ఉందమ్మా!... ఏదీ! ఏదీ! డాక్టరుగారు ఇస్తాడే ఆ నిద్రమందు...ఇచ్చేయవే...

రామ

(గబగబా ఆ సీసా వెదకి గ్లాసులో పోస్తుంది.)

వేణు

అబ్బా! ఘోరంగావుందే బాధ.

రామ

(చేతులు తడబడినవిగాబోలు వేగముగా చుక్కలు పడ్డవి గ్లాసులో. గ్లాసు నోటిదగ్గ పెట్టి త్రాగించును.)

వేణు

(త్రాగిన రెండునిమిషాలకు నిశ్శబ్దము. తల్లి వేణును రెప్పవాల్పకుండా చూస్తూవుంది. వేణు కండ్లుమూసుకుంటాడు. తల్లి అలాగే చూస్తూవుంది.) (తలుపు చప్పుడు)

రామ

(అదిరిపడి) ఎవరు?

[తెరలో]

డాక్టర్ని.

రామ

రండి.

(ప్రవేశం డాక్టరు గుప్తా)

నిద్రపోతూవున్నాడు...ఇప్పుడే మీరిచ్చిన నిద్రమందిచ్చాను చాలబాధ పడుతూవుంటే.

డాక్టరు

ఆఁ బాగా నిద్రపోతున్నట్టుంది...(కొంత అనుమానిస్తూ) రామలక్ష్మమ్మ గారూ! ఎవరూ లేరు గనుక...ఒకగొప్ప సందర్భం తటస్థించింది... చెప్పకతీరదు.

రామ

(లేచి) ఏమిటది?

డాక్టరు

మీరు మీకోడల్లో మార్పు ఏమైనా కనిపెట్టినారా?

రామ

(తల ఊపును.)

డాక్టరు

అనుకున్నాను. మీవంటి సూక్ష్మజ్ఞులకు కష్టంకాదు...మళ్ళ అడుగుతాను... నేను చెప్పేమార్పు ఏమిటో అర్థం చేసుకున్నారా...

రామ

ఆఁ, శారద...సర్వం...

డాక్టరు

అంతే కాదమ్మా.

రామ

(నిట్టూర్చి) అబ్బా! డాక్టరుగారూ! తెలుసును...మూడవ నెల...

డాక్టరు

(నమస్కరిస్తూ) క్షమించండి...మూర్ఖుణ్ణి. అబ్బాయికి తెలిస్తే ఈ రోగ బాధతోకూడ మనోవేదన ఎలా సహిస్తాడు! ఎంతఘోరము! భరించ డానికి శక్తికూడా లేదే.

రామ

(కండ్లనుండి నీళ్లు ధారలుగా ప్రవహిస్తూవున్నవి.) అబ్బాయికి ఆ బాధ తప్పిపోయింది.

డాక్టరు

ఆఁ, ఆఁ. (అప్పుడు హఠాత్తుగ వేణుచెయ్యి పట్టుకొంటాడు. నాడి దొరకదు.) ఎప్పుడు? ఎప్పుడు...ఏమైంది?...

రామ

(ఏడుపు బిగబట్టి ఆపి) నిద్రమందు...చుక్కలు...ఎక్కువైనవి.

డాక్టరు

(అంతా స్ఫురిస్తుంది) ఆఁ ఆఁ...ఎంతధైర్యము!......

[తెరలోనుంచి వినబడుతుంది మెట్లెక్కి—వచ్చు శారదాసత్యనారాయణుల సంభాషణ.]

శార:—ఎంత అద్భుతంగా ప్రకటించిందోయి భావాలు అగ్రేటాగార్బో.

సత్య.—అబ్బో ఫిల్ముల్లో ఆసక్తి ఎక్కువవుతూవుందే.

శారద:—పోదూ వేళాకోళం.

[రామలక్ష్మమ్మ డాక్టరు ఒకరినొకరు చూచుకొంటూ నిలబడతారు. రామలక్ష్మమ్మ కన్నీళ్లధారమాత్రం ఆగలేదు.]

[తెర]



## పాత్రలు

| | |
|---|---|
| చిత్రరేఖ | వేశ్య |
| రత్నం | చెలికత్తె |
| రంగారావు | జమీందారు |
| సీతయ్యమ్మ | రంగారావు భార్య |
| నరిసి | దాసి |

రంగము :

[చిత్రరేఖ ఇంట్లో, మేడమీద పడకగది. ఒకమూల మంచం. ఇంకోవైపు నిలువుటద్దం, అద్దంముందు బల్ల, కుర్చీ, అదే వరుసన బీరువా.]

[చిత్రరేఖ వేశ్య. ఎంత వయస్సో యథార్థంగా చెప్పడానికి ఎవరితరం? పదహారేండ్ల బాలికకాదు, వయసు చెల్లిందీకాదు; ప్రౌఢ; సౌందర్యవతి, కులుకుకన్న కళ ఎక్కువ; కళ్లల్లో నవ్వూ ఏడుపూ మిళితమైనట్లుంటుంది.]

[చిత్రరేఖ కుర్చీమీద కూర్చుని శృంగారించుకుంటున్నది. ప్రక్కన రత్నం నిలుచుని సహాయం చేస్తూ ఉంటుంది. రత్నం నౌఖరుకాదు, చెలికత్తె కాదు, నేస్తముకాదు,—అన్నీని ఒకవిధంగా.]

చిత్రరేఖ

ఒసే! ఏవీ లోలకులు.

రత్నం

అవిగో. ఎదురుగానే ఉన్నవమ్మా. పరధ్యానంగా ఉన్నారుగాని.

చిత్రరేఖ

అవునే... ఎందుకో తెలియదు.

రత్నం

కారణాలకేమమ్మా, ఎన్ని కావలస్తే అన్ని.

చిత్రరేఖ

అంటే?

రత్నం

జమీందారుగారు ఇంకా రాలేదు, ఒకటి. వారి జనానావారు వస్తున్నామని కబురు, రెండు,... చాలవూ.

చిత్రరేఖ

(గొలుసులు వేసుకొంటూ) భయం వేస్తూవుందే... రత్నం; పాడు. గుండె ఎలాకొట్టుకొంటూ వుందో!

రత్నం

ఎందుకూ... మీకంతా విపరీతం... మర్యాదస్థులు మనయింటికి వస్తే వారి గుండెలు కొట్టుకోవాలిగాని, మనకెందుకూ భయం, ఆగుద్దా?

చిత్రరేఖ

ఛీ. వేళాకోళం గాదే.

రత్నం

ఎందుకు వస్తారో దేవిగారు ?

చిత్రరేఖ

అర్ధోక్తిగా వ్రాశారు. అంతే. "మీకూ మాకూ ఆప్తులైనవారి క్షేమంకోసరంగా మీతో జరురుగా మాట్లాడవలెను" అని...(కనుబొమలు చేర్చి) అంకెందుకూ కలిపిపెట్టమని చెప్పడానికి గాబోలు.

(క్రిందతలుపు తట్టిన చప్పుడు) వెళ్ళవే...వచ్చారు... త్వరగా. (రత్నం వెళ్ళును చిత్రరేఖ ముస్తాబు త్వరగా ముగించి బల్ల శుభ్రంచేస్తుంది.)

(ప్రవేశం రంగారావు. జమీందారు. వయస్సు రమారమి 30, ముఖంలో తెలివితేటలు విషయాసక్తికి లోబడినట్లు స్ఫురిస్తుంది. ఇప్పుడు దేహం ఆత్మ రెండూ అలిసిపోయినవి. నిరాశాభావం వదనంమీద తాండవిస్తూవుంది)

చిత్రరేఖ

(ఎదురొచ్చి, చేతులు పట్టుకొని) ఏమిటీ వేషం! ఎందుకింత ఆలస్యం చేశారు.

రంగారావు

ఈ వేషమా! ఇన్‌సాల్వెంటు వేషం, బిచ్చగాడి వేషం—ఆలస్యం షాహుకారు పన్నిన పద్మవ్యూహంలోనుంచి బైటికిపడి రావడంచేత.

చిత్రరేఖ

ఏమి చేశారు.

రంగారావు

(వికటంగా నవ్వుచు) మూడు డిగ్రీలక్రింద మూడువారంట్లు

చిత్రరేఖ

అబ్బా! ఏమి బాధ మీకు. వీటికి అంతం ఉండవా స్వామీ!

రంగారావు

చిత్రా! నన్నడగకు. (మంచంమీద. కూర్చుంటాడు)...పోనీ ఎందుకా గొడవ, నీదగ్గిర ఉన్నంతసేపు అయినా సంతోషంగా ఉండక...స్వర్గంలో కూడ సంసారతాపత్రయమేనా...ఏదీ—రా.

చిత్రరేఖ

(ఉత్సాహం లేకుండా) ఎంతండీ బాకీ ?

రంగారావు

అబ్బబ్బ! ఇంకా బాకీల్లోనే ఉన్నావూ? ఎంతో కొండంత.

చిత్రరేఖ

చెపుదురూ...మీ క్షేమం మీ పట్టపు రాణికేగాదు, మాకూ కొంచెం అవశ్యమే.

రంగారావు

ఆ! ఆ! ఏమిటీ మాటలు... పట్టపురాణి ఎందుకు వచ్చింది ఇప్పుడు.

చిత్రరేఖ

ఇంకా రాలేదు. కాని త్వరలోనె ఆ భాగ్యం కలుగుతుంది లెండి.

రంగారావు

గందరగోళం... నీమాటలు నీకర్థం అవుతున్నాయేమో...నాకుమాత్రం ఊహూం...

చిత్రరేఖ

నా పాపం! మళ్లీ చెప్తాను. వినండి బాగా. మీ రాణీగారు, మీ జనానావారు, మీ పట్టపుదేవిగారు ఇక్కడికి, ఈ యింటికి, నా యింటికే, ఈ రోజు విజయం చేస్తామని ఉత్సాహపూర్వకంగా వర్తమానం చేశారు...ఇప్పుడైనా అర్థమైనదా.

రంగారావు

(తటాలున మంచం దిగి) ఏమి, ఏమి...ఆవిడ ఇక్కడికా వస్తానన్నది? నిజంగా.

చిత్రరేఖ

అహ్హాహా! ఏమో అంతవింత, అంత విడ్డూర్యం... ఇది ఇల్లుగాని దుకాణం కాదుగదా. మీరు రావడానికి తగినప్పుడు మీ అర్ధాంగిని రావడానికి అర్హత లేదేమి?

రంగారావు

ఏమి సామ్యం చెప్పావు! నేను భ్రష్టు అయితే......

చిత్రరేఖ

అందులో లేదా సహధర్మచరణం?

రంగారావు

ఆ వాదన వద్దు. కాని, ఆశ్చర్యంగావుంది. ఎందుకు వస్తానన్నది?

చిత్రరేఖ

ఇదుగో, నమ్మకం లేకుంటె ఉత్తరం, (మేజాసొరుగులోనుంచి తీసి ఇస్తుంది) మీరే చదువుకొని ఊహించుకోండి,...

రంగారావు

(ఉత్తరం చదువుకొని) నా క్షేమం కోసరమా? నీతో ఏమి పని?

చిత్రరేఖ

భలే! మీ క్షేమం కోరేవారికి నాతో పని ఉండదనా అభిప్రాయం: శెహభాష్.

రంగారావు

కాదు, చిత్రం కాదు, పాపం, నీవేమి చెయ్యగలవు... అమాయికురాలు అలా వ్రాశింది గాని.

చిత్రరేఖ

ఆవిడ అమాయికురాలున్నూ నేను మాయలాడిన్నా?

రంగారావు

(వినిపించుకోకుండా) బహుశా, ఈ విధంగా ఉండవచ్చు; నా కష్టదశంతా తెలిసేవుంటుంది. తనకు సహాయం చెయ్యడానికి శక్తిలేదు. తనతండ్రి నడిగితే నాకు పరువుతక్కువ...ఇక నిన్ను అయినా అడగడానికి నిశ్చయించుకొన్నది....

చిత్రరేఖ

దేనికి.

రంగారావు

ఇక దేనికి. నా బాధకు ఔషధానికి—ధనానికి.

చిత్రరేఖ

నేను బ్యాంకీ అధికారినా, షాహుకార్నా?

రంగారావు

అబ్బ!...ఏదో విధంగా, నగలూ, నాణ్యాలూ, అమ్మీ గిమ్మీ,

చిత్రరేఖ

(చిరు నవ్వుతో) ఓహో!

రంగారావు

కానీ ఎంతటి కార్యానికి పూనుకొన్నదో....దేవాలయానికి తప్ప ఇంకొక చోటికి వెళ్లదు...ఎంత త్యాగం...ఎంత ఉదారం.

చిత్రరేఖ

(కండ్లలో నవ్వులేదు ఇప్పుడు; అంతా ఏడుపే)

రంగారావు

(పచార్లు చేస్తూ) అబ్బా! దౌర్భాగ్యుడు, నా కోసం...ఎటువంటి సంశయాలు పుట్టించి. ఎంత ప్రేమను ప్రతిఫలించింది...ఎంత కష్టపడ్డాలో కదా. ఇలా సంకల్పించుకోవడానికి...అయ్యబాబ్బా! ఎవ్వరైనా చూస్తే ఏమను కుంటారు?...("తలుపు" "తలుపు" అని శబ్దం) ఎవరది?

చిత్రరేఖ

వారే అనుకొంటాను.

రంగారావు

నేనో మరి.

చిత్రరేఖ

(నవ్వుతూ) మంచం క్రింద

రంగారావు

(కోపంతో) ఛీ.

చిత్రరేఖ

ఆ చిన్న గదిలోకి వెళ్లండి.

రంగారావు

గన్నం గది తలుపు తీస్తుందేమో?

చిత్రరేఖ

తియ్యనివ్వను. (గదిలోకి ప్రవేశపెట్టి తలుపు మూస్తుంది)

(ప్రవేశం రత్నం.)

అమ్మా! అమ్మా, వారు వచ్చారు.

చిత్రరేఖ

పైకి తీసుకురా.

రత్నం

ఇక్కడికేనా? (అని చుట్టూ చూస్తుంది రంగారావు కోసం)

చిత్రరేఖ

(తల పంకించి ఆగదిలో ఉన్నారని సూచిస్తుంది.)

రత్నం

(నవ్వి వెళ్లిపోతుంది.)

(చిత్రరేఖ అద్దం వద్ద నిల్చుని సద్దుకొంటుంది.)

(ప్రవేశం సీతయ్యమ్మ, దాసి నరసి, సీతయ్యమ్మ ముసుగు వేసుకుంది. సన్నగా నాజూకుగా ఉంది. 20, 22 సంవత్సరాలకన్నా ఉండవు. ముసుగు తీయగానే ముఖంలో అహంభావం గర్వం కనబడతవి.)

చిత్రరేఖ

రాణీగారు చాలా ప్రయాసపడ్డారు. కాకతో కబురుపంపితే నేనే వచ్చేదాన్నే.

సీతయ్యమ్మ

యీ నరకోసరం బిచ్చగాండ్రు భాగ్యవంతుల యిండ్లకు వెళ్తారుగాని తాను యిండ్లకు భాగ్యవంతుల్ని రమ్మనను.

చిత్రరేఖ

రామరాయ. ఏమి ఉపమానం చెప్పినారు.

సీతయ్యమ్మ

పతివ్రతలకు సరియైనదే.

చిత్రరేఖ

కూర్చోండి. (కుర్చీచూపును)

సీతయ్యమ్మ

(కూర్చుని) మీరు.

చిత్రరేఖ

మాయింట్లో నేను నిలబడవచ్చును లెండి.

సీతయ్యమ్మ

నరసీ. క్రిందికి వెళ్లి కాచుకో...(నరసి వెళ్లును) ఎక్కువకాలం వుండ వీలు లేదు... నేను వచ్చినపని మీరు ఊహించే వుందురు.

చిత్రరేఖ

లేదు.

సీతయ్యమ్మ

వారి ప్రస్తుతస్థితి మీకు తెలిసే వుంటుంది.

చిత్రరేఖ

అంటే ఋణాల బాధా?

సీతయ్యమ్మ

అవును.

చిత్రరేఖ

ఆఁ. ఎరుగుదును. జూదం నలధర్మరాజుల్నే ముంచి వేసింది. వారెక్కడ ఆగగలరు.

సీతయ్యమ్మ

(కోపంతో) ఇప్పుడు వారి చర్యలను విమర్శించడానికి రాలేదు నేను.

చిత్రరేఖ

ఎందుకు వచ్చారో చెప్పరైతిరి. నా చర్యలు విమర్శించడానికా.

సీతయ్యమ్మ

కాదు. విమర్శించి ప్రయోజనము లేదు. మాతండ్రిగారు నన్ను ఏరి, కూర్చి, వారికి ధారవోసినారు. అగ్నిసాక్షిగా నన్నువివాహం చేసుకొన్నారు. రూపలావణ్యాలు లేని కోతినిగాను, చదువు సంధ్యలు లేని మూఢురాలిని గాను,—అయినా నిన్ను చూచి, నీ సహవాసం ప్రాప్తించిన క్షణంనుంచి నా మాటే మరిచి పోయారు... నీవు ఏమి మచ్చుమందు చల్లినావో,— నీ తళుకు బెళుకులకే మోసపోయారో నీలో ఏమికనబడ్డదో. కానీ నీ యిల్లే వారి అంతఃపురం అయిపోయింది.

చిత్రరేఖ

ఏభార్యకు గాని మగడుంచుకొన్న వేశ్యలో గుణాలు ఎప్పుడూ కనబడవు.

సీతయ్యమ్మ

ఎందుకీ దెప్పిపొడుపు ?...నాదే తప్పు...నేను వచ్చిన దిందుకు కాదు... వారు కష్టదశలో ఉన్నారు. పరువు ప్రతిష్ఠలకే భంగం కలిగే స్థితి వచ్చింది... మంచి రోజుల్లో వారు ఎంతో మీకు ఉపకారం చేశారు. రెండు చేతుల్తో ధనం ఇచ్చారు. నగలు చేయించారు. నీకు ఇష్టమైనదల్లా...అణుమాత్రం కృతజ్ఞత ఉంటే చాలు, ఈ విపత్తునుంచి వారిని దాటించ గలవు. నాదగ్గర ధనంలేదు; మా తండ్రిగారిని అడగడానికి వారు సమ్మతించరు...నీదగ్గరున్న పెద్దనగల్లో ఒక్కటి అమ్మితే సరిపోతుంది ఈ వారంట్లు మొత్తానికి...ఇదే నా ప్రార్థన, స్వయంగా నేనే వచ్చి వేడుకొంటే మీరు ఒప్పుకుంటారన్న నమ్మకంతో వచ్చాను.

చిత్రరేఖ

పాపం, వృథాప్రయాస...నావద్ద ధనంలేదు. పట్టుమని పదివేందల ఖరీదుచేసే వస్తువేలేదు. ఏమిచెయ్యను.

సీతయ్యమ్మ

మరి మీరు వేసుకున్న ఈ నగలన్నీ...వారు మీకు ఇచ్చినవి కావా...

చిత్రరేఖ

కావు...

సీతయ్యమ్మ

ఇంకెవ్వరో...

చిత్రరేఖ

పొరబాటు, నేను కొనుక్కున్నవే. (నవ్వుచు) కావలిస్తే ఈ క్షణంలో వీటిని అన్నీ ఇచ్చేస్తాను... ప్రయోజనం మాత్రం వుండదు.

చెల్లించినది నాలుగువేలు దాగాపు... ఆగస్టు 15—నారసల కమ్మలు, పలకసరులు అమ్మితే వచ్చినవి దాదాపు నాలుగువేలు...ఇలాగే, మిగతవి.

సీతయ్యమ్మ

(పరాభవాగ్ని దహించేస్తూవుంది. మాట్లాడడానికి పదాలురావు. ఆలోచిస్తూవుంది తీవ్రంగా ఏవిధాన్నైనా బాధించాలని.)

చిత్రరేఖ

అదీకథ. సర్వం అదృశ్యమైంది ఆ విధంగా నే నున్నాను మిగత.

సీతయ్యమ్మ

(ఏదో స్ఫురించింది. పెదవి విరిచింది) పాపం! ఎందుకు చేశారు ఈలాగు?

చిత్రరేఖ

ఎందుకా? అవును. అర్థంకాదు మీకు,—వేశ్యకు హృదయం ఉండదు, ప్రేమ ఉండదు. విశ్వాసము, కృతజ్ఞత ఏవీ వుండవు.

సీతయ్యమ్మ

(మెల్లగా) ఆహా! ఎంత ధన్యులో మీరు. అంత అభిమానం అంత స్వార్థ త్యాగం ఉంది గనకనే నాకు ఇంకా ఆశ కలుగుతూవుంది...

చిత్రరేఖ

ఏ విధంగా.

సీతయ్యమ్మ

కోప్పడకుండా వినండి. మీ ఆభరణాలు, ధనం, ఐశ్వర్యం అన్నీ అదృశ్యమై పోయినవి, నిజమే. కాని మీ సౌందర్యం మిమ్మల్ని వదలి పోలేదు.

చిత్రరేఖ

ఏదో గూఢంగా ఆలోచించి మాట్లాడుతున్నారు.

సీతయ్యమ్మ

గ్రహించే వుంటారు...మీ సౌందర్యానికి వెలలేదూ? అమ్మితే కొనుక్కోడానికి సిద్ధంగా వున్నవారు లేరా? ఆ షావుకారే ఒప్పుకోడూ?...ఇక మీరు ప్రేమకోసరం, వారి మంచి కోసరం చెయ్యలేని పని వుంటుందా?

చిత్రరేఖ

(కోపం పొంగి పొరలిపోతూవుంది) ఎంత గొప్ప ఊహ, ఎట్టి ఉదార స్వభావం...పెండ్లాడిన భార్యలని మిడిసిపడుతున్నావు కాబోలు. పాతి వ్రత్యం అంతా మీ వంటివారి కాణాచి అనుకొన్నావు. ఆ గర్వంతో కదూ ఈ విధంగా మాట్లాడుతున్నావు?...ఏమిటి మీ గొప్పతనం? మీ పాతివ్రత్యం! వేరే గతిలేక, స్వాతంత్ర్యం లేక, ధర్మమని, విధియని మీరు భర్తలమీద భక్తి విశ్వాసం కనబరుస్తున్నారు. మాబోటి వాళ్లకు ఆ సంకెళ్లు లేవు, స్వచ్ఛందవృత్తి. ఈ కృత్రిమ బంధాలులేవు, బలవంతపు పాతివ్రత్యం మీది, నాది స్వతంత్రమైనది. నాకు నిజంగా వారమీద ప్రేమ, విశ్వాసం. ధర్మమనిగాదు, విధియనిగాదు, వేరే గతిలేకగాదు.

సీతయ్యమ్మ

ఏమిటి ఉపన్యాసం, సానిముండకు పాతివ్రత్యం!—నేతిబీరకాయ.

చిత్రరేఖ

జాగ్రత్త.—ఇల్లెక్కి వచ్చావని ఊరకున్నాను.

సీతయ్యమ్మ

ఏం చెయ్యగలవు.

(తటాలున ప్రక్కగది తలుపు తెరుచుకొని ప్రవేశం రంగారావు.)

రంగారావు

ఆగండి, ఆగండి...నామూలాన ఎందుకీ దెబ్బలాట...దౌర్భాగ్యుణ్ణి.

సీతయ్యమ్మ

(ఆశ్చర్యంతో) ఇంతసేపు ఇక్కడే ఉన్నారా.

రంగారావు

అవును, దొంగలాగు—సీతా! చిత్రను అన్ని మాటలాడడం తప్పుగాదా. ఎంత త్యాగంచేసింది నాకోసరం...నాకు తెలియకుండానే. దానిఋణం తీర్చుకోగలమా.

సీతయ్యమ్మ

సాష్టాంగంగా పడమంటే పడతాను. అరుంధతీ, దాక్షాయణి అని పూజ చేయమంటారా...ఏంచేసింది ? మీరిచ్చిన డబ్బు ఓర్చుకోలేక మీకోసరం ఉపయోగించింది.

రంగారావు

సీతా ! అదికాదు. ఆఖరున నీవు చెప్పింది తప్పే...నీకు చిత్ర గుణం తెలియదు.

సీతయ్యమ్మ

అవును కలికాలం. బోగందాని పాతివ్రత్యం ఇల్లాలి దగ్గిర ఘోషించే వరకు వచ్చింది...క్షమించండి. ఎంతం అమాయికులండీ.

చిత్రరేఖ

ఈ సంభాషణ ఆపేస్తే బాగుంటుందేమో.

(కింద మాటలు వినబడుతవి...రత్నం హఠాత్తుగా ప్రవేశించును.)

రత్నం

అమ్మగారూ; షాహుకారు అసురాంసేట్ వచ్చి, వెళ్లనంటున్నాడు. మిమ్మల్ని చూచి తీరాలట.

చిత్రరేఖ

దొంగ. మీరిక్కడున్నది సందేహించే వచ్చాడు...మీరు మాట్లాడకుండా ఇక్కడే ఉండండి...వాడిని ఏవిధంగానో బుట్టలోవేసి పంపించేస్తాను. తరవాత మీరు వెళ్లవచ్చును...

రంగారావు

వాడెందుకు వచ్చాడిక్కడికి? అప్పుడప్పుడు వస్తావుంటాడా.

చిత్రరేఖ

ఏమిటామాటలు...మీరిక్కడుంటారని ఎవరికీ తెలియదంటారా—అదీగాక,

రుచియెరిగినసుక్క—క్రిందటి దఫా నేను సొమ్ము చెల్లించానని మళ్లీ ఆశతో వచ్చాడు....ఇక్కడే ఉండండి...వచ్చేస్తాను. (నిష్క్రమణ)

రంగారావు

(అనుమానం కమ్మేస్తూవుంది మనస్సుని. పచారుచేస్తుంటాడు.)

సీతయ్యమ్మ

(మెల్లగా నవ్వుచు) ఎంత వెర్రిబాగులువారండీ మీరు పాపం. షావుకారు హఠాత్తుగా వచ్చాడుకదూ... జమీందారుగారు పకీరయ్యారు మరి.

రంగారావు

ఛీ, ఛీ, ఎంత త్యాగం చేశింది.

సీతయ్యమ్మ

ఏమి నమ్మకమండీ. కాగితాలుచూసి ఖంగారైపోతున్నారు...నగలు దాచేసి ఇలాటి దొంగరసీదులు పుట్టించడం బ్రహ్మకార్యమటండీ.

రంగారావు

మరి వారంట్లకు చెల్లించినసొమ్ము ?

సీతయ్యమ్మ

(నవ్వుచు) షావుకార్లకు మాత్రం సానులంటే అభిమానం ఉండదనా మీ అభిప్రాయం.

రంగారావు

ఆఁ ఆఁ అంతమోసమే.

సీతయ్యమ్మ

మీకు నేను చెప్పవలసినదాన్ని కానుగాని మనపెద్దలు ఊరికే చెప్పారండి. వారకాంతల తత్వంగురించి...చక్కనివాడైన రాజచంద్రుండైన అని

రంగారావు

అలాగైతే నన్ను ఎప్పుడో వదిలి ఉండాలిగదా...చిల్లిగవ్వ ఇవ్వలేదే సంవత్సరాలనుంచి.

సీతయ్యమ్మ

దానికి కారణం వేరు. జమీందారుగారు ఉంచుకున్నదంటే హోదా—విలువ ఎక్కువ—అడ్వర్ టైజుమెంటు......

రంగారావు

నిజంగా ?

సీతయ్యమ్మ

కైపుతీరితేగాని నిజం తెలియదు. ఇకనైనా నా ప్రార్థన వినరూ? ఈవూరూ, ఈ స్నేహం అన్నివదిలేసి మా నాన్నగారి దగ్గరకు వెళ్లిపోదాము. ఎంతో సంతోషిస్తారు. వెధవషావుకార్లు పదిమందికి జబాబు చెస్తారు...అన్ని కష్టాలు పోతవి...

రంగారావు

(నిట్టూర్పుతో) సరే.

సీతయ్యమ్మ

అమ్మయ్య, ఎంత మంచిరోజు! ఏన్నాళ్లకి? (ప్రవేశం చిత్రరేఖ)

చిత్రరేఖ

అబ్బ ! వెళ్లిపోయాడు.

రంగారావు

నీ ఋణం తీర్చుకోలేను ఈ జన్మంలో...

సీతయ్యమ్మ

మీ సొమ్ము త్వరలోనే వీలుచేసుకొని పంపిస్తారు.

చిత్రరేఖ

(పిచ్చిగా చూస్తుంది రంగారావువంక)

రంగారావు

చిత్రా. నేను మా మామగారింటికి వెళ్లిపోతున్నాను, సీతతో.

సీతయ్యమ్మ

(విజయం తనదని సూచిస్తూ చిరునవ్వుతో) ఈ రోజే.

చిత్రరేఖ

నిజంగా ? నిజంగా ? మళ్లీ ఎప్పుడు?

సీతయ్యమ్మ

ఎప్పుడో రాకుండానే ఉంటారా ?

రంగారావు

లేదు. నేను ఈ వూరికి మళ్లీ రాను.

చిత్రరేఖ

(తబ్బిబ్బై) ఆఁ ఆఁ...

సీతయ్యమ్మ

సెలవు...(రంగారావు కీలు బొమ్మలాగు తల ఊపుతాడు. సీతయ్యమ్మ దారి తీస్తుంది...చిత్రరేఖ బల్ల పట్టుకుంటుంది ఆవేదనతో. రంగారావు, సీతయ్యమ్మ నిష్క్రమిస్తారు.)

చిత్రరేఖ

(కుర్చీలో కూలబడి, చేతుల్తో ముఖం కప్పివేసుకొని ఏడుస్తూవుంటుంది.)

(ప్రవేశం, రత్నం)

రత్నం

అమ్మా.

చిత్రరేఖ

(లేచి, కండ్లు తుడుచుకొంటూ) రత్నం. అగ్గిపుల్ల.

రత్నం

(అగ్గిపెట్టె అందిస్తుంది)

చిత్రరేఖ

(వారంట్లు, డిక్రీలు, రసీదులు, అన్నింటిని పోగుచేసి వెలిగిస్తుంది. ఆ వెలుగులో చూస్తే చిత్రరేఖ కండ్లల్లో నవ్వే కనబడదు.)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B196 |
| పుస్తకం పేరు | వాటికా గుచ్ఛము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 71 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 56, 35, 80, 9, 28, 60 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Pragathi |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |